**Touheed Aur Shirk**
**(Telugu)**

# ఇస్లాంలో బహుదైవరాధన లేదు

మూలం
మౌలానా సయ్యద్ అబుల్ ఆలా మౌదూదీ (రహ్మలై)

అనువాదం
ఇఖ్బాల్ అహ్మద్

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఇస్లాంలో బహుదైవారాధన లేదు

## సంకలనకర్త విజ్ఞప్తి

ఈ కరపత్రం ప్రముఖ ఇస్లామీ తత్వవేత్త మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ (రహ్మలై)గారి రెండు ప్రసంగాలతో కూడి వుంది. ఇందులో మౌలానా తౌహీద్ మరియు షిర్క్ అనే అంశంపై అభిప్రాయ ప్రకటన చేశారు. ఆయన ఒక అద్దాన్ని మన ముందుంచారు. అందులో తౌహీద్ అంటే ఏమిటో, షిర్క్ అంటే ఏమిటో, తౌహీద్ స్వభావం ఎలాంటిదో షిర్క్ స్వభావం ఎలాంటిదో, తౌహీద్ ఎటువంటి ఆహ్లాదకర ఉద్యాన వనమో, షిర్క్ ఎటువంటి భయంకర క్షీణ దశో, తౌహీద్ ఎటువంటి వెలుగో, షిర్క్ ఎటువంటి అంధకారమో తౌహీద్ వలన ఎటువంటి ఉత్తమ సమాజం ఉనికిలోకి వస్తుందో, షిర్క్ ఎటువంటి నైతిక రాహిత్యం గల సమాజాన్ని తయారుచేస్తుందో ప్రతి మనిషీ ఆ అద్దంలో చూసుకోవచ్చు. అల్లాహ్ మనల్ని షిర్క్ నుండి కాపాడుగాక! మరియు తౌహీద్‌పై స్థిరపడేట్లు చేయుగాక! ఆమీన్

అఖ్తర్ హిజాజి
17-8-1977

అల్లాహ్ అనుగ్రహాలు మనపై అంతులేనివి. వాటిని ఎవరూ లెక్కించజాలరు. ఆయన చేసిన అత్యంత గొప్ప ఉపకారం. ఆయన మనకు స్వచ్ఛమయిన తౌహీద్‌ను, కల్తీలేని తౌహీద్ శిక్షణనిచ్చాడు. అందులో అల్లాహ్ వ్యక్తిత్వం, ఆయన గుణగణాలు, అధికారాలు, హక్కుల్లో మరెవ్వరి భాగస్వామ్యానికి కించిత్తయినా అవకాశం ఉండే ఆస్కారం లేదు. అన్ని విధాలుగా దైవత్వం కేవలం ఒకే సత్య ప్రభువు కోసం ప్రత్యేకించబడింది. ఇది ఎంత గొప్ప భాగ్యం. దాని నిజమయిన విలువను షిర్క్ మరియు తౌహీద్‌ల తేడాను మీరు బాగా గుర్తించగలిగి నప్పుడే గ్రహించగలరు.

## మానవాళి మరియు షిర్క్

షిర్క్ యొక్క తప్పనిసరి ప్రత్యేకత మానవుల్ని విభజించడం, మానవులతో మానవులను చీల్చడం. ప్రపంచంలోని బహుదైవారాధకులందరూ ఏదయినా ఒకే ఆరాధ్యుని లేదా కొందరు ఆరాధ్యుల సమక్షంలో హాజరైనట్లుగా సాక్ష్యమిచ్చిన ఉదాహరణ పూర్తి మానవ చరిత్రలో ఎక్కడా లభించదు. పూర్తి ప్రపంచ విషయం అలావుంచి ఏదయినా ఒక ప్రాంతంలో నివసించే బహుదైవారాధకులందరూ కూడా ఏ ఆరాధ్యుని లేదా కొందరు ఆరాధ్యుల విషయంలో ఏకాభిప్రాయులయిన దాఖలాలు లేవు. వేర్వేరు తెగలకు వేర్వేరు దేవుళ్ళు ఉన్నారు. ఇంకా ఈ వేర్వేరు దేవుళ్ళు కూడా ఎల్లప్పుడూ ఆరాధింపబడలేదు. కాలగమనంతోపాటు మారుతూ పొయ్యారు. ఈ విధంగా బహుదైవారాధన ఎప్పుడయినా ఏ కాలంలో నయినా మానవతను సమీకరించే శక్తిగా ఏర్పడలేదు. పైగా ఒక విభేద కారకశక్తిగా ఉండింది. అది కేవలం విశ్వాసం కారణంగా మానవులను ఒకరితో మరొకరిని చీల్చడం దాని స్వభావంలో ఏకంచేసే సామర్థ్యం లేకపోవడం చేత దాని కారణంగా ఏర్పడే విబేధాలు క్రమక్రమంగా

మానవులలో, జాతులలో, తెగలలో, వంశాలలో మరియు భాషలలో, వర్గాలలో, దేశాల విభేదాలు లేవనెత్తుతాయి. ఇంకా ఇవే విభేదాలు కొనసాగి ప్రజలలో ఒకరిపై మరొకరికి ద్వేషాన్ని విరోధాన్ని పుట్టిస్తాయి. ఒకరినొకరు హక్కుల్ని కబళించడానికి, ఒకరిపై మరొకరు దౌర్జన్యం చెయ్యడానికి సిద్ధం చేస్తాయి. చివరికి వీటి కారణంగానే ప్రపంచంలో రక్తపాతం జరుగుతుంది. హత్యాకాండ మారణహోమం పెచ్చరిల్లుతుంది. పోరాటాలు జరుగుతాయి. దేవుని భూమి కల్లోలాలు, కీడులతో నిండిపోతుంది. ఈనాటి వరకూ మానవులకూ మానవులకూ మధ్య జరిగిన యుద్ధాలకు కారణాలను మీరుగనుక విశ్లేషించినట్లయితే వీటివెనుక ఏదో ఒక రూపంలో షిర్క్ పాత్ర ఉన్నట్లు తెలుస్తుంది. లేక అది పుట్టించిన అపవిత్రులలో ఏదో ఒక అపవిత్రత వాటికి కారణం అని తెలుస్తుంది.

## దేవుని ఏకత్వానికి బహుమానం ఉమ్మత్ ఏకత్వం

దానికి భిన్నంగా తౌహీద్ కల్తీ షిర్క్ నుండిగనుక పవిత్రం అవుతే దాని తప్పనిసరి ప్రత్యేకత మానవతను విభజించే, మానవులతో మానవులను చీల్చే బదులు వారిని పరస్పరం కలపడం, ఒకే సకల లోక ప్రభువు దాస్యంలో, విధేయతలో చేర్చడం, ఏకోన్ముఖం చెయ్యటం, సృష్టితాల దైవత్వం యొక్క అన్ని రకాల భావనలనుండి తమ మస్తిష్కాన్ని పవిత్రవంతం చేసి కేవలం ఒకే దైవం సత్యమని అంగీకరిస్తారో సకల లోకాల ప్రభువు ఉనికి, ఆయన గుణగణాలు, అధికారాలు మరియు హక్కుల్లో-ఎందులోనూ, ఎన్నడూ, ఏ ప్రాణికీ భాగస్వామ్యం ఉండటం అధర్మం అన్న భావనను తమ మనోమస్తిష్కాలలోని మూల మూలలనుండి తీసిపారవేస్తారో, అటువంటి వారు ఎందరున్నాసరే వారు తప్పనిసరిగా ఒక ఉమ్మత్ (అనుచర సమాజం) అవుతారు. తప్పకుండా వారిలో ఏకత్వం జనిస్తుంది. వారు పరస్పరం మిత్రులు, పరస్పరం సోదరులు తప్పకుండా అవుతారు.

అల్లాహ్ ఏకత్వం తప్ప మరే విషయమూ మానవుల్ని కలిపేదిగా కనబడి నట్లు ఉదాహరణ ఏదీ కనబడదు. మానవులు గనక ఏకం కాగలరు అంటే ఆ ఏకైక ప్రభువు, వాస్తవంలో సకల సృష్టికీ ప్రభువు అయిన వాడి సమక్షం లోనే. ఆయననే అంగీకరించడం వల్ల వారిలో ఐకమత్యం జనిస్తుంది. ఆయన దాస్యంపై ఏకాభిప్రాయం వారిని పరస్పరం సోదరులుగా చేయ గలదు. దైవ ఏకత్వం ఫలితం ఉమ్మత్ ఏకత్వం ఎన్నడూ తప్పుగా రుజువు కానటువంటి అచంచల వాస్తవం. ఇది ఎన్నడూ తప్పుగా రుజువు కానటు వంటి అచంచల వాస్తవం. ఇది ఎన్నడూ తప్పుగా రుజువు కాబడదు కూడా. ఎప్పుడయినా, ఎక్కడయినా దైవ ఏకత్వంపై విశ్వాసం గురించి ప్రకటన అయితే ఉంది కాని ఇలా ప్రకటించుకునే ఉమ్మత్ (సమాజం)లో ఏకత్వం ఉనికిలో లేకపోగా విబేధాలు, విరోధాలు పరస్పర ద్వేషం, వ్యతిరేకతల ఉపద్రవాలు నెలకొని ఉండటం మీరు చూడగలరు. వాటిని మీరు అంతర్ దృష్టితో పరిశీలించినట్లయితే ఈ ఉమ్మత్‌లో షిర్క్ దూరి వచ్చిందని మీరు తెలుసుకుంటారు. ఇంకా షిర్క్‌కే సంబంధించిన అనేక వివాదాల్లో ఏదో ఒక వివాదం వ్యక్తుల్లో వర్గాలను పరస్పరం విడదీస్తోంది. అలా కాకపోయి నట్లయితే, రెండు + రెండు= ఐదు కానట్లుగానే షిర్క్‌తో కల్తీ చేయబడ కుండా ఒకే దైవాన్ని అంగీకరించేవారు ఏది విరోధ వర్గాలుగా విభజింప బడలేదు.

మానవులందరినీ అన్ని కాలాల్లో, అన్ని యుగాల్లో ఒక ఉమ్మత్‌లో చేర్చడానికి తౌహీద్ పునాదిని ఏర్పాటుచేసిన తర్వాత అల్లాహ్ ఆ ఏకత్వాన్ని శాశ్వత స్థాపన కోసం ఇంకా ఏంచేశాడో చూడండి.

## మానవుడికి దైవమార్గదర్శకత్వం

ఆయన ఒక ప్రవక్త(స)ను పంపి ఒకగ్రంథాన్ని అవతరింపజేసి మానవ జీవితంలోని ప్రతి పార్శ్వం, ప్రతి రంగం కోసం చక్కని

మార్గదర్శకత్వం ప్రసాదించాడు. దానికి వెలుపల మనిషికి ఎక్కడా సన్మార్గాన్ని అన్వేషించే అవసరం ఏదీ మిగిలివుండదు. ఇక ఒక ఉమ్మత్ లాగా ఏర్పడిన తర్వాత మానవులు ఒకవేళ విభేదాలకు గురయ్యారు అంటే వారికి ఏదైనా ఒక చోటనుండి పూర్తి జీవన వ్యవస్థ లభించకపోవడమే అందుకు కారణం. వారు వివిధ పరిస్థితులు, వివిధ ప్రాంతాలు, వివిధ కాలాలలో ఇతర మార్గాల ద్వారా సన్మార్గాన్ని పొందక తప్పలేదు. ఇటువంటి పరిస్థితిలో అయితే నిస్సంశయంగా మానవులు సన్మార్గం కోసం అనేక మార్గాల వైపు మరలుతారు. అందువల్ల తప్పనిసరిగా వారిలో విభేదం ఏర్పడుతుంది. కాని ప్రతి కాలంలో ప్రతి ప్రాంతంలో అన్ని రకాల పరిస్థితులలో ఒకే మార్గం ద్వారా సన్మార్గం లభించినట్లయితే దైవ ఏకత్వంలో చేరుకునే ఉమ్మత్‌కు విభేదానికి సంబంధించిన ప్రమాదం ఏదీ మిగిలివుండదు. అయితే ప్రజలు అజ్ఞానం కారణంగా ఆయన చూపిన సన్మార్గం గురించి ఎరిగి ఉండకపోతే లేక మేథస్సు, ఆలోచనల్లోని వక్రత కారణంగా అసలు సద్భోద నుండి తమ తరపు నుండి కాస్త తగ్గించడమో, కాస్త పెంచడమో చేస్తే ఇలా హెచ్చుతగ్గులు చేసే ప్రతి వర్గం తాను ఏర్పాటు చేసిన ధర్మమే అసలు ధర్మమని దానిని అనుసరించనివాడు మార్గభ్రష్టుడు, అధర్మపరుడు అని వాదిస్తుంది.

## జవాబుదారీ కేవలం సత్యప్రభువు ఎదుటనే

ఉమ్మత్ ఏకత్వంపై స్థిరతకు సన్మార్గంపై అది స్థిరంగా ఉండటానికి అందించబడిన రెండో ముఖ్యవిషయం ఆది మానవుడు ఒకే దైవం ఎదుట జవాబుదారు అన్న విశ్వాసం ఆ ఒక్క దేవుడే ప్రపంచంలోనూ అతడి అదృష్టాన్ని తీర్చిదిద్దాలన్నా, చెడగొట్టాలన్నా పూర్తి అధికారాలు గలవాడు, ఆ ఒక్క దేవుడే ప్రతిఫల దినానికీ యజమాని. ఆయన తప్ప మానవులను

లెక్క అడిగేవాడు లేడు. శిక్షా బహుమానాల అధికారాలూ ఎవరి చేతుల్లోనూ లేవు. నేను చెప్పినట్లుగా ఈ విశ్వాసం ఉమ్మత్ ఏకత్వానికి హామీనివ్వడమే గాక దానిపైనే మానవుల గుణగణాలు సక్రమంగా, సరిగా ఉండటమూ ఆధారపడి ఉన్నాయి. ఈ విశ్వాసం యొక్క ఆ తప్పనిసరి ఫలితాలను వ్యర్థపరిచి మానవులను కలత చెందే, దారి తప్పే బాటసారిగా చేసేది ఏమయినా ఉందీ అంటే అది ప్రజలు ప్రపంచంలో దైవం తప్ప ఇతర వివిధ వ్యక్తుల్ని కోరికలు తీర్చేవారిగా తీర్మానించసాగటమే. పరలోకం గురించి, అక్కడ దేవుని న్యాయంలో జోక్యం చేసుకునే అధికారం ఇతరులకు ఉంది అని కొందరు భావించసాగారు.

## ఏకత్వం యొక్క గొప్ప దృశ్యం

దీనితర్వాత అల్లాహ్ మనపై ఉమ్మత్ ఏకత్వాన్ని క్రియాత్మకంగా నెలకొల్పగల, శాశ్వతంగా కార్య నిమగ్నులను చేసే కొన్ని విషయాల్ని తప్పనిసరి చేశాడు. ఇందులో మొట్టమొదటిది నమాజ్. ప్రపంచవ్యాప్త ముస్లింలందరికీ రోజూ ఐదుపూటల నమాజ్ ఫర్జ్ (విధి)గా చేయబడింది. అందుకోసం ఒక ఖిబ్లా (దిశ) నిర్ణయించబడింది. ఆ దిశగా ప్రతి నమాజు వేళకు తూర్పు, పడమరలు, ఉత్తర, దక్షిణాలు ఇంకా వివిధ దిశల మధ్య ఉండే ముస్లింలందరూ అభిముఖంగా ఉండాలి. ఈ దృశ్యాన్ని మనో నేత్రంతో గనక చూసినట్లయితే కాబా గృహం ఒక కేంద్రం అని భూమండ లంలోని ముస్లింలు ఆ ఒకే కేంద్రం వైపు తిరిగి నిలబడటం, కూర్చోవడం, రుకూ సజ్దాలు చేస్తున్నారు అని అర్థమవుతుంది. ప్రతి నమాజ్ వేళకు ఈ పరిధి పవిత్ర గృహంతో మొదలవుతుంది. అక్కడ కాబా గృహం చుట్టూ నమాజ్ చేసే వారందరూ ఒక వృత్తంలో కనబడతారు. ఇంకా ఇదే పరిధి వ్యాపిస్తూపోయి భూమండలం అంతా వ్యాపిస్తుంది. ఇది ప్రతిరోజూ ఐదుపూటలూ జరిగే ఆచరణ, అంతకుమించి ఏకత్వానికి నిదర్శనం

మరేముంటుంది? ఇస్లాంలో తప్ప ఇటువంటి దృశ్యాన్ని మరెక్కడయినా చూడగలరా?

ఈ ఐదు పూటల నమాజ్‌ను విధిగా చేయడంతోపాటు దానిని జమాఅత్ తో (సామూహికంగా) చెయ్యటం తప్పనిసరి చేశాడు అల్లాహ్. ఎక్కడయినా ఒక్కడు మాత్రమే ఉండి, అతడికి జమాఅత్‌తో చేసే అవకాశం లేకుంటే తప్ప. దైవారాధన లక్ష్యం విడివిడిగా నమాజ్ చేయడం వలన కూడా పూర్తవుతుంది. కాని ఉమ్మత్ సామూహిక నమాజ్ లేకుండా ఏకత్వ లక్ష్యం సాధించడం అసాధ్యం. అందుచేతనే ఎక్కడయినా ఇద్ద రయినా ముస్లింలు ఉండి ఉన్నప్పుడు అక్కడ ఒకరు ఇమామ్‌గా మరొకరు ముక్తదీ (ఇమాం వెనుక నమాజ్ చేసేవాడు) అయి ఇద్దరూ కలిసి సామూహిక నమాజ్‌లో పాల్గొనడం తప్పనిసరి చెయ్యబడింది.

## దైవోపాసకుల విశ్వమానవ సౌభ్రాతృత్వం

ప్రజలను నమాజ్ కోసం పిలిచే పద్ధతి కూడా ఇస్లాంలో సాటిలేని విధంగా ఉంది. ప్రపంచంలోని ఏ ఇతర మతం వారికిగానీ, మతరహిత వర్గానికిగానీ ఏదైనా తమ సమావేశానికి పిలుపునిచ్చే ఇటువంటి పద్ధతి దక్కలేదు. నమాజ్ పిలుపునిచ్చేందుకు భూమండలంపై ప్రతిచోట, ప్రతిరోజు ఐదుపూటలా నమాజ్ కోసం పిలిచేవారి, పిలువబడేవారి భాష ఏదయినా సరే ఒకే భాషలో అజాన్ (పిలుపు) ఇవ్వబడుతుంది. ఈ ఉమ్మడి భాషలో అజాన్ ప్రపంచంలోని ఏ భాగంలోనైనా దీన్ని వినే ప్రతి ముస్లిం ఇది నమాజ్‌కోసం ఇవ్వబడే పిలుపుగా తెలుసుకుంటాడు. ఇది ఎక్కడ్నుంచి వినవస్తుందో అక్కడకు నేను నా మిల్లత్ సోదరులతోపాటు సమావేశమై ఏకైక ప్రభువు ఆరాధనలో పాల్గొనవలసి ఉందని గ్రహిస్తాడు. ఇంకా విశేషమేమంటే అజాన్ నమాజ్ కోసం పిలుపు మాత్రమే కాక ఇస్లాం యొక్క

మొత్తం విశ్వాసాన్ని ప్రకటించడం కూడాను. 'అల్లాహ్ అందరికంటే గొప్పవాడు' 'ఆయన తప్ప ఆరాధ్యుడు ఎవరూ లేరు' 'ముహమ్మద్ అల్లాహ్ ప్రవక్త' యే ఏకైక ప్రభువు వైపునకయితే నన్ను పిలువడం జరుగుతోందో ఆయన ఆరాధనలోనే నా శ్రేయస్సు ముడిపడి ఉంది. ఇంతకన్నా ఉత్తమ సందేశ విధానాన్ని ఏ మానవుడయినా ఊహించగలడా? ఈ సందేశం ప్రపంచంలో అన్నిచోట్ల ప్రజల్ని నమాజ్ కోసం సమీకరించడమేకాక ఒకే విశ్వాసంపై ఏకీకృతమూ చేస్తుంది.

## నమాజ్

ఇక నమాజ్ వేళలు, దానిని చేసే విధానాలు, అందులో చదవబడే విషయాలు, ప్రపంచం అంతటా ఒకేవిధంగా ఉన్నాయి. కొన్ని చిన్నచిన్న విషయాలలో స్వల్పమయిన తేడాలు ఉన్నప్పటికీ దక్షిణాఫ్రికాకు చెందిన ముస్లిం ఉత్తర అమెరికాలో లేక జపాన్ వాసి అయిన ముస్లిం మొరాకోకో ఫ్రాన్సుకో వెళ్ళినట్లయితే అక్కడ నమాజ్‌కు బదులు మరేదయినా ఆరాధన జరుగుతుందని మాత్రం భావించడు. ఈ విధంగా నమాజ్ దైవారాధన పట్ల ఉత్సాహాన్ని ఎల్లవేళలా తాజాగా ఉంచుతుంది. దాంతోపాటు దైవారాధకులలో విశ్వమానవ సోదర భావాన్ని కూడా సజీవవంతం సంచలన భరితమూ చేస్తుంది.

## ఉపవాసం

ఉపవాసాల వ్యవహారమూ ఇలాంటిదే. కేవలం ఉపవాసాల ద్వారా దైవదాస్యం మాత్రమే ఉద్దేశ్యబడి ఉంటే ప్రతి ముస్లింను, అతడు సంవత్సరంలో ఎప్పుడయినా ముప్పయి రోజులు ఉపవాసం పాటించాలని ఆజ్ఞాపించడం జరిగి ఉంటే సరిపోయేది. కాని ఏకైక ప్రభువు ఆరాధనతో పాటు ప్రపంచవ్యాప్త ముస్లింలను ఏకైక సమాజంగా కూడా చేయడం

ఇందులోని ఉద్దేశ్యం. అందుచేత ఒక్క రమజాన్ మాసంలోనే ప్రతి సంవత్సరం ముస్లింలందరూ ఈ ఆరాధనలో పాల్గొనేలా ఉపవాసం పాటించాలని నిర్ణయించబడింది. ఉపవాస ప్రారంభానికీ, ఉపవాస విరమణకూ ఒకే సమయాన్ని నిర్ణయించడం ద్వారా అందరి ఉపవాసం ఒకేసారి ప్రారంభమయి, ఒకేసారి విరమించడం జరుగుతుంది. ముస్లింలందరూ జీవితాంతం ప్రతి ఏడు 29 లేక 30 రోజులు ఒకే పద్ధతిలో, ఒకే విధమయిన నిబంధనలతో పాటించబడాలని రోజా నియమాలూ ఒకేవిధంగా ఉంచబడ్డాయి. దీనివలన ప్రపంచవ్యాప్త ముస్లింలందరిలో తాము ఒకే షరీఅత్ అనుసరించే సమాజం అన్న స్పృహ వారిలో సజీవంగా తాజాగా ఉంటుంది. అంతేకాక ఐదుపూటల నమాజ్‌తోపాటు తరావీహ్ నమాజ్ కూడా ప్రతి రాత్రీ సామూహికంగా ప్రపంచమంతటా చేయబడు తుంది. అందులో సర్వ సాధారణంగా పూర్తి ఖుర్‌ఆన్ పఠించబడుతుంది. ఇది ఆరాధన మాత్రమేకాక, దైవవాణి ప్రచారం మరియు ప్రస్తావన కూడా అవుతుంది. ఇంకా ఉమ్మత్ ఏకత్వాన్ని మరింత దృఢతరమూ, శాశ్వతమూ చేసే వస్తువు కూడా. దివ్య ఖుర్‌ఆన్‌ను ప్రతి సంవత్సరమూ నెల రోజులంతా ప్రతి రోజు వినేవారు దాని భాషను ఎరిగినా ఎరుగకపోయినా దానిని అర్థం చేసుకున్నా, అర్థం చేసుకోక పోయినా మొత్తమ్మీద వారందరిలో తామం దరమూ ఒకే గ్రంథాన్ని విశ్వసించే వారం అని ఆ గ్రంథం వారి ప్రభువు పంపిన గ్రంథం అన్న ఉమ్మడి భావన తప్పక కలుగుతుంది.

## హజ్

ఇక హజ్‌ను కూడా గమనించండి. మిల్లతె ఇస్లాం (ఇస్లామీ సమాజం) ఒక ప్రపంచవ్యాప్త సమాజం అనదగ్గ ప్రదర్శన, అంతకుమించి మరే ఆరాధనలోనూ జరుగదు. హజ్ యాత్ర చేయగల స్తోమత ఉన్న

వారందరిపై జీవితంలో ఒకసారి ఈ బాధ్యతను నిర్వర్తించడం తప్పనిసరి అని అల్లాహ్ నిర్ణయించాడు. ఇంకా సంవత్సరంలో కేవలం ఒక్కసారి మాత్రమే వచ్చే కొన్ని నిర్ణీత దినాలలోనే ఈ బాధ్యత నిర్వర్తింపబడుతుంది. ఈవిధంగా భూమండలంపై ఎక్కడెక్కడ అయితే ముస్లింలు నివసిస్తున్నారో అక్కడినుండి ఒకే కాలంలో స్తోమత గల ముస్లింలందరూ పవిత్ర మక్కా నగరంలో సమావేశం కావలసి వస్తుంది. ఈ విషయం మీరు గమనించండి. ప్రతి ఏడూ ప్రపంచం నలుమూలల నుండి సాధారణ మానవులను పట్టి లాక్కొచ్చే సందర్భం ఇదే. యుఎన్ఏలో సమావేశమయ్యే రాజకీయ మేథావులను, అంతర్జాతీయ సదస్సులలో పాల్గొనే.వివిధ జాతీయ నాయకులను కూడా ఇక్కడకు తీసుకురాదు. ఇది ప్రతి దేశం మరియు ప్రతి జాతికి చెందిన ప్రజలను లక్షలాది సంఖ్యలో పట్టితెస్తుంది. వారం దరూ కలిసి ఒకే దైవదాస్యం చేయాలన్న లక్ష్యంతో తీసుకువస్తుంది. ఒకేసారి కాబా గృహాన్ని ప్రదక్షిణ (తవాఫ్) చెయ్యాలని, ఒకేసారి అందరూ కలిసి మక్కా నుండి మినాకు, మినా నుండి అరఫాత్‌కు, అరఫాత్ నుండి ముజ్దలిఫాకు, తిరిగి ముజ్దలిఫా నుండి మినాకు రావాలి. ఒకేసారి అందరూ ఖుర్బానీ ఇవ్వాలి. ఒకేసారి షైతాన్‌ను రాళ్ళతో కొట్టాలి. ఒకేసారి అరఫాత్‌లో ఆగి, మినాలో కొన్నాళ్ళు నివసించాలి. ఒకే భాషలో అందరూ లబ్బయిక్, లబ్బయిక్ అంటూ బిగ్గరగా పలకాలి. ఏ ఖిబ్లావైపు అయితే తిరిగి తమతమ ప్రాంతాలలో వున్నప్పుడు రోజూ ఐదు పూటలూ నమాజ్ చేసేవారో, ఆ ఖిబ్లా చుట్టూ నిలబడి నమాజ్ చెయ్యాలి. వీరిలో ప్రతి వంశం, ప్రతి జాతి, ప్రతి వర్ణం, ప్రతి దేశానికి చెందినవారు ఒకేచోట కలుసుకుంటారు. ప్రతి భాష మాట్లాడేవారు పోగవుతారు. అందరూ తమ తమ యిండ్ల నుండి రకరకాల దుస్తులు ధరించివస్తారు. వారిలో ధనికులు ఉంటారు, పేదలూ

ఉంటారు. రాజులూ ఉంటారు, సేవకులూ ఉంటారు. కాని అక్కడ ఈ తేడాలన్నీ అంతమయిపోతాయి. హరమ్ హద్దులకు చేరుకోకముందే అందరూ బట్టలు విడిచి, ఒకేరకమయిన ఫకీర్లవంటి దుస్తులు ఎహ్రామ్ ధరిస్తారు. అప్పుడు వారిని చూసినవారు, వీరిలో ఎవరు ఏ ప్రాంతంవారో ఎవరి హోదా, అంతస్తు ఏమిటో తెలుసుకోలేకపోతారు. గొప్ప గొప్ప వారిని కూడా తమ స్థాయినుండి దించి సాధారణ మానవుల స్థాయికి తేవడం జరుగుతుంది. అత్యంత నాగరికులను కూడా నాగరికతలో దిగువస్థాయికి చెందినవారితో కలపడం జరుగుతుంది. లక్షలాది మనుషుల సమూహంలో ప్రదిక్షణ చేస్తూ (తవాఫ్) సయీ (పరుగు) చేస్తున్నప్పుడు సాధారణ మానవులు తోపుళ్ళకు గురయినట్లే, ధనవంతులూ నెట్టివేయబడతారు. పరమ ప్రభువు దర్బారులో చేరిన తరువాత ప్రతి వ్యక్తి తరపు నుండి గొప్పతనపు పిశాచం తొలగిపోతుంది. రంగు, వంశం, భాష, దేశాలకు సంబంధించిన దురభిప్రాయాలన్నీ అంతం చెయ్యబడతాయి. ప్రపంచం నలుమూలల నుండి వచ్చే ముస్లింలలో ఒకే ఉమ్మత్ అన్న దృఢ భావనను వారిలో కలిగించడం జరుగుతుంది. దాని ప్రభావాన్ని ఎవరయినా తొలగించ దలుచుకున్నా తొలగించలేరు. ప్రపంచంలోని ఏ మత వర్గం దగ్గర అయినా, మతరహిత వర్గం దగ్గర అయినా తమ అనుయాయుల్ని ఈవిధంగా ప్రపంచస్థాయిలో ఏకం చేసే, ప్రతి ఏడు ఈ ఏకత్వాన్ని పునరుజ్జీవింపచెయ్యగలిగే ఇటువంటి పరుసవేది లాంటి చిట్కా ఏదీ లేదు. ఎవరి ఏకత్వాన్ని అయితే అంగీకరించి, ఏ ప్రవక్త(స) మరియు ఏ గ్రంథాన్ని అనుసరించడానికి ఆమోదించి, ఎవరి సమక్షంలో తాము జవాబు చెప్పుకోవలసి ఉందో ఆ స్ఫూర్తిని కలిగి ముస్లింలు ఒకే ఉమ్మత్ అవుతారో, ఆ ప్రభువు అద్భుత వివేకమే ఇదంతా.

## ఇది ఈదుల్ అజ్‌హా

అల్లాహ్ కురిపించిన మరో కారుణ్యం ఏమంటే ఆ ఆరాధనా విధుల చెల్లింపు కోసం ఇస్లాం కేంద్రంలో సమావేశం అయ్యేవారి వరకే హజ్ శుభాలను పరిమితం చెయ్యలేదు.

ప్రపంచమంతా ఉన్న ముస్లింల కోసం కూడా ఒక అవకాశం కల్పించాడు. హజ్ కాలంలోనే వారు తమ స్వస్థలాలలో ఉంటూనే హాజీల స్థితికి చేరుకోగలరు. ఈ మూడురోజుల లోపల ప్రతి భూభాగంలో చేయబడే ఈదుల్ అజ్‌హా నమాజ్, ఖుర్బానీలు ఈ లక్ష్యం కోసమే నిర్ణయించబడ్డాయి.

హాజీలు హజ్ చేయడానికి మినా నుండి అరఫాత్‌కు వెళ్ళే రోజు ఉదయం నుండి (జిల్‌హజ్జ 9వ తేదీ) ప్రతి ఫర్జ్ నమాజ్ తర్వాత బిగ్గరగా **అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ వలిల్లా హిల్ హువ్** పలకాలి. ఈ తక్బీర్‌ల పరంపర మరో నాలుగు రోజులు కొనసాగించాలి. మినాలో హాజీలు మకాం చేసే కాలం అంతా ప్రపంచంలో ఈ తక్బీర్లను బిగ్గరగా పఠిస్తు గడిచిపోవాలి. హాజీల కోసం యౌముల్ ఖర్ (ఖుర్బానీ రోజు) అయిన జిల్‌హజ్జ 10వ తేదీయే ఈదుల్ అజ్‌హా నమాజ్ కోసం నిర్ణయించబడింది. ఈ నమాజ్‌కు వెళ్ళేటప్పుడూ, నమాజ్ నుండి తిరిగి వచ్చేటప్పుడు కూడా ఈ తక్బీర్లను బిగ్గరగా పఠించాలని ఆదేశించబడింది. ఆ రోజునే ప్రపంచమంతటా ఈద్ నమాజ్ తర్వాత హాజీలు మినాలో చేసే ఖుర్బానీలు ఆరంభమవుతాయి. ఈవిధంగా ప్రపంచంలోని ఏ ఉమ్మత్‌లో లక్షలాది ముస్లింలు ఇప్పుడు హాజ్‌లో పాల్గొంటున్నారో నేనూ ఈ ఉమ్మత్‌లోని వ్యక్తినే అని ప్రతి ముస్లిం భావిస్తాడు. పూర్తి హజ్‌కాలంలో తక్బీర్లు పలుకుతూ, నమాజ్‌లో పాల్గొంటూ, ఖుర్బానీ చేస్తూ హాజీల వెంట ఉంటున్నాడన్నమాట. ఈదుల్

అజ్‌హా నాడు హజ్‌వంటి ప్రపంచవ్యాప్త గొప్ప సమావేశం జరుగకపోయినా తమ తమ ప్రాంతాలలో ముస్లింలు ప్రతిచోట వీలయినంత పెద్ద సమావేశం ఏర్పాటు చేసి నమాజ్ చేస్తారు. మొత్తం భూమండలం మీద ఒకే కాలంలో ఈ పండుగ జరుపబడటం మరో విధంగా ఉమ్మత్‌యొక్క ప్రపంచ వ్యాప్త ఏకత్వ ప్రదర్శన అయిపోతుంది.

## తౌహీద్ ఒక సంపూర్ణ జీవన వ్యవస్థకు పునాది

ముక్తసరిగా నేను చెప్పిన దానివల్ల అల్లాహ్ తౌహీద్ (ఏకత్వం) రిసాలత్ (దైవదౌత్యం) మరియు ఆఖిరత్ (పరలోక) విశ్వాసాలతో జాతి, దేశం, వర్ణం, భాష మరియు వంశ దురభిమానాలు అంతంచేసి ప్రపంచ మానవులంతా ఒక ప్రపంచవ్యాప్త సమాజంగా ఏర్పడటానికి పునాది ఏర్పాటు చేశాడన్న వాస్తవం స్పష్టమయిపోతుంది. ఈ ఉమ్మత్‌లో కేవలం ఏకత్వమేకాక ఎంతో దృఢమయిన క్రియాత్మక ఏకత్వం జనింపచేయగల ఆరాధనా విధానాలను నిర్ణయించాడు. అంతేకాక తన చివరి ప్రవక్త(స) మరియు తన చివరి గ్రంథం ద్వారా ఆయన పూర్తి మానవాళి కోసం అన్ని కాలాలకు సమగ్ర చట్టం అయిన సంపూర్ణ జీవన విధానాన్ని ప్రసాదించాడు. అది ఎంత సమగ్ర చట్టం అంటే తన ఎటువంటి అవసరం కోసం అయినా ఎక్కడయినా ఏ యుగంలోని ప్రజలకయినా సన్మార్గం కోసం మరే ఇతర మార్గదర్శకత్వం వైపు మరలవలసిన అవసరమే ఉండదు.

## మరి ఈ మహాభాగ్యాన్ని తిరస్కరించడం ఎందుకు?

ఏ ఉమ్మత్‌కయితే అల్లాహ్ సంపూర్ణ సమగ్ర జీవన వ్యవస్థనిచ్చాడో, ఏ ఉమ్మత్ ఏకత్వాన్ని స్థాపించడానికయితే ఆయన ఇంత గొప్ప ఏర్పాటు చేశాడో, ఇంకా ప్రపంచ మానవాళి యావత్తూ ఆ వ్యవస్థలో ఉండేలా ప్రపంచంలో ఈ సత్యధర్మాన్ని వ్యాపింపచేసే బాధ్యత ఏ ఉమ్మత్‌కు అప్పగిం

చాడో ఆ ఉమ్మత్ తన అసలు పనిని వెనుకబెట్టి తమ ఏకత్వాన్ని ముక్కలు చెక్కలు చెయ్యడానికి సిద్ధమయిందంటే అంతకంటే దురదృష్టం, లజ్జాకర దురదృష్టం మరేముంటుంది. ఏ కారణంగా మనిషిని మనిషి మ్లేచ్ఛునిగా భావిస్తున్నాడో, అంటరానివాడుగా అసహ్యకరమైనవానిగా పరిగణిస్తున్నాడో, అల్పునిగా, దూషితునిగా భావిస్తున్నాడో దేవుని భూమిని హింసా దౌర్జ న్యాలు, హత్యాకాండలు, వినాశకర చర్యలతో నరక సాదృశ్యం చేసేశాడో ఆ కారణాలను అంతం చెయ్యడానికే ఈ ఉమ్మత్ ఉనికి లోకి తీసుకు రాబడింది. ఈ ఉమ్మత్ మిషన్, దీని లక్ష్యం ప్రపంచాన్ని ఒకే దైవ దాస్యం, సత్య ప్రమాణంగల ఒకే చట్టాన్ని అనుసరించడం, ఒక విశ్వవ్యాప్త సోదర బంధంలోకి తెచ్చి, దౌర్జన్య స్థానంలో న్యాయం, యుద్ధం స్థానంలో శాంతి, ద్వేషం విరోధాల స్థానంలో శ్రేయోభిలాష ప్రేమను తెచ్చి ఏవిధంగా ముహమ్మద్(స) సకల లోకాలకు కారుణ్యమూర్తిగా ప్రభవింపచేయబడ్డారో ఆవిధంగా మానవాళి పట్ల కారుణ్యంగా అవతరించాలి. కాని ఇదంతా వదిలిపెట్టి ఈ ఉమ్మత్ తన శక్తియుక్తుల్ని పరస్పర విభేదాలు కల్పిం చడంలో వినియోగిస్తోంది. ఉమ్మత్‌లోని వ్యక్తులు, వర్గాలు పరస్పరం ఒకరి నొకరు వ్యతిరేకించుకోవడం, వ్యతిరేకతను పెంచి ద్వేషం విరోధం వరకూ తీసుకుపోవడం ఉమ్మత్‌కు అత్యంత ఆసక్తికరమైన కాలక్షేపం అయి పోయింది. అభిప్రాయ బేధం, జ్ఞానం, పరిశోధనల భేదం సత్సంకల్పంతో కలిగినదయితే కారుణ్యంగా రూపొందగలదు. పూర్వీకులయిన సత్పు రుషుల మధ్య అది కారుణ్యంగా నిరూపించబడింది కూడాను. కాని ఇప్పుడు ఈ ఉమ్మత్‌లో అభిప్రాయబేధం అంటే వ్యతిరేకత అయి పోయింది. ఒకరితో ఏదయినా విషయంలో అభిప్రాయభేదం కలగడం అంటే మనిషి జబ్బలు చరిచి అతడి వెనుక పడటంగా మారిపోయింది. చివరకు ఎదుటివారిని అల్పునిగా, దూషితునిగా అవమానించడంలో

ఏమాత్రం లోటు చెయ్యడం లేదు. మతపరమయిన విభేదం కలిగినప్పుడు దానిని నరకద్వారం దాకా చేర్చనిదే విశ్రమించడం హరాం అయిపోయింది. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త(స) ఉమ్మత్ కోసం ఏకత్వానికి ఎంత గొప్ప ఏర్పాటు చేశారో అది కాస్తా వారికోసం ఇప్పుడు విభేదాల ద్వారాలు తెరవబడటం అంతకన్నా గొప్ప దురదృష్టం. ఏకత్వం ద్వారాలు మూత బడుతూ పోతున్నాయి. చివరకు కలిసి నమాజ్‌లో పాల్గొనడం కూడా కష్టమై పోయింది. మస్జిద్‌లు వేరయిపోయ్యాయి. ఒక మస్జిద్‌లో మరో మస్లక్ (పద్ధతి) వారు గనుక నమాజ్ చేసుకుంటే వారు నమాజ్ చేసిన ఆ జాగా అపవిత్రం అయిపోతుంది. ఒక వర్గం వ్యక్తి మరో వర్గం వ్యక్తితో కరచాలనం (ముసాఫహ) చెయ్యడానిక్కూడా తన చెయ్యి ఎక్కడ మలినం అయిపో తుందోనని సిద్ధపడటం లేదు.

ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్

## ఇదంతా దేని ఫలితం?

ఇదంతా దేని ఫలమో నేను ముందుగా సూచించాను. తౌహీద్, దీన్, షరీఅత్‌లలో వివిధ ప్రజలు కొత్త విషయాలను తెచ్చి చేర్చారు. అసలు ధర్మానికి చెందిన విశ్వాసాలు, ఆదేశాలలో కొన్నింటిని చేర్చారు. మరికొన్నిం టిని తొలగించారు. ముఖ్యంకాని వాటిని అతిముఖ్యం గావించారు. ముఖ్యమయినవాటిని ముఖ్యం కానివిగా చేసేశారు. ఇంకా ఈ కల్తీల్ని, హెచ్చుతగ్గుల్ని ఈమాన్‌కు ఆధారం అన్నారు. ఈ కారణంచేతనే ఉమ్మత్‌లోని వివిధ వర్గాలు పరస్పరం కలహించుకున్నాయి. ఇటువంటి పరిస్థితిలో సన్మార్గానికి దూరంగా ఉన్నవారికి సత్సందేశం అందించి, ఈ విశ్వమానవ సోదర బంధంలోకి తీసుకురావడం వేరే విషయం. ఈ సోదర బంధంలో ముందు నుంచే ఉన్నవారిని కూడా దీనినుంచి బహిష్కరించే పని పుణ్యకార్యంగా భావించి ఆచరించడం జరుగుతోంది. పరిస్థితుల ఈ

స్వరూపం మనల్ని ముస్లిమేతరుల కోసం వేడుకగా చేసివేసింది. ఈ ఉమ్మత్ అసలు ఉమ్మత్‌యే కాదు అని ప్రాచ్య విద్యా నిపుణులు పలకడానికి సాహసించారు. ప్రస్తుతం ఇస్లాం ప్రచురణా మార్గంలో ఏదయినా పెద్ద అవరోధం ఉందీ అంటే అది మన ఈ పరిస్థితే. దైవం మనపై కరుణించుగాక! మనల్ని సన్మార్గంపై నిలుపుగాక!

ప్రపంచంలోని మతాలు, శాఖలలోని ప్రాథమిక లోపం ఏమంటే వారు తమనూ, సకల సృష్టినీ సృజించిన సృష్టికర్త గురించి సరయిన భావన కలిగి ఉండనూ లేదు. దాని గురించి సరయిన ఆచరణాశైలి అవలంబించడమూ లేదు. ఇస్లాం మాత్రమే మానవుల సృష్టికర్త గురించి మనకు సరయిన భావన కలిగించే ధర్మం. దానిని తౌహీద్ (దైవ ఏకత్వం) అని అంటారు. అది మానవుడికి సరియిన ఆచరణా శైలిని చూపుతుంది. దానిని అతడు అవలంబించాలి. ఇది మానవ జాతులన్నింటిలో ముస్లింలను ప్రత్యేకించి చూపుతుంది. ఈ ప్రత్యేక గొప్పతనం కారణంగా వీరు స్వచ్ఛమయిన తౌహీద్‌ను అంగీకరించేవారు అని తెలుస్తుంది. ఇది తప్ప ముస్లింలకు ప్రాథమికంగా ఇతర జాతులనుండి విలక్షణత చూపే మరో విషయం లేదు. కాని ముస్లింలు తమ ఈ విలక్షణ స్థాయిని విస్మరించడం వింతయిన విషయం. దీనికి ఎంతగా విచారించినా తక్కువే అవుతుంది. ఈవిధంగా ముస్లిం గొప్ప మహదానుగ్రహం నుండి తమను తాము దూరం చేసుకున్నారు. అందుచేత నా దృష్టిలో అన్నింటికన్నా ముందు చెయ్యవలసిన అత్యవసరమయిన పని, మనం స్పష్టంగా నిర్మలమయిన తౌహీద్‌ను గ్రహించడమేకాక ఒక్కొక్క పిల్లవాడి మనోమస్తిష్కాలలో తౌహీద్ పట్ల సరయిన అవగాహన కలిగించే ప్రయత్నం చేయాలి. ఈ ప్రాథమిక లోపం దూరం కానంతవరకూ ఈ విషయంలో మరో సంస్కరణ ఏదీ ఫలవంతం కాజాలదు.

## దైవ ఏకత్వం అంటే ఏమిటి?

తౌహీద్ అంటే ఏమిటి? దేవుడు ఉన్నాడని కేవలం మనిషి ఒప్పుకో వడమేనా? మొత్తమ్మీద దేవుని ఉనికిని తిరస్కరించే జాతి ఏదీ అప్పుడూ ఉండలేదు. ఇప్పుడూ లేదు. ఏ కొద్ది మందో నాస్తికులు అన్ని కాలాలలోనూ ఉండేవారు. రష్యాలో నాస్తికత్వం కూడా ప్రఖ్యాతి చెందింది. కాని రష్యా పాలకులు తమ జనాభాలో ఐదుశాతం మందిని అయినా దైవతిరస్కారు లుగా చెయ్యలేక పొయ్యారు. దేవుడు లేడు అని ప్రాపగాండ కొనసాగిస్తూ నలభయి సంవత్సరాల కన్నా ఎక్కువ కాలం గడిచింది. ఈ ప్రాపగాండ కోసం ధనం, శక్తి ఖర్చు చేయబడింది. కాని జరిగిందేమంటే వెనుకటి ప్రపంచ యుద్ధంలో జర్మన్ సేనలు విజయ పరంపర కొనసాగిస్తూ రష్యాను ఆక్రమించుకుంటూ పోయినప్పుడు స్టాలిన్ ప్రజలతో మస్జిదులలో, చర్చలలోకి పోయి మనల్ని ఈ ప్రమాదం నుండి గట్టెక్కించమని ప్రార్థిం చండి' అన్నాడు. అంటే దైవాన్ని ప్రార్థించేవారూ, దేవునికి వ్యతిరేకంగా ఉద్యమాలు నడుపుతూ ఉండేవారు కూడా దేవుని ఉనికిని అంగీకరించక తప్పలేదు. దేవుని ఉనికిని జాతి మొత్తంగా తిరస్కరించడం మానవుడికి ఏనాడూ సాధ్యపడలేదు. ఇంకా తౌహీద్ అంటే దేవుడు ఒక్కడే అని మనిషి అంగీకరించడం కాదు. అనేకమందిని దైవంగా అంగీకరించని జాతి ఏదీ లేదు. భారత్‌లోని బహుదైవారాధకుల దృష్టిలో పరమాత్మ ఒక్కడే- ప్రాచీన కాలంలోని జోరాష్ట్రియన్లు దైవం ఒక్కడే అని అంగీకరించేవారు. పవిత్ర ఖుర్‌ఆన్ మక్కా తిరస్కారుల్ని మిమ్మల్ని ఎవరు పుట్టించారు? అని ప్రశ్నించి నప్పుడు వారు అల్లాహ్‌యే అనేవారు. భూమీ ఆకాశాలను ఎవరు సృష్టిం చారు అని పవిత్ర ఖుర్‌ఆన్ ప్రశ్నించినప్పుడు వారు అల్లాహ్‌యే అనేవారు- వాస్తవానికి ప్రాచీన కాలంలోనూ, ఈనాడు కూడా మానవుడు లోనయిన

భ్రష్టత్వం ఏమంటే మానవుడు అల్లాహ్ ఒక్కడే అని అంగీకరిస్తూనే అనేక చిల్లర దేవుళ్ళనూ పూజిస్తున్నాడు.

## షిర్క్ - బహు దైవారాధన లక్షణం!

అనేకమంది దేవుళ్ళకు బదులు అల్లాహ్‌నే పోషకుడుగా ప్రభువుగా అంగీకరించాలని నొక్కి వక్కాణించింది దైవగ్రంథం. ఈ సంస్కరణ కోసం తన వాగ్ధాటినంతా ఇందుకోసమే ఉపయోగించింది. దివ్యఖుర్ఆన్‌లో అల్లాహ్ ఉనికి గురించిన రుజువులకంటే ప్రభువు, పోషకుడు అని నిరూపించే రుజువుల విషయంలోనే ఎక్కువగా చెప్పడం జరిగింది. నాస్తికత్వాన్ని అధర్మంగా సూచించే (విమర్శించే) ఆయతులు రెండో మూడో ఉన్నాయి. కాని షిర్క్‌ను ఖండించే ఆయతులయితే అపారంగా ఉన్నాయి. అల్లాహ్‌తో పాటు ఇతరులను సాటి కల్పించే విషయంలో ప్రజలు, ప్రాథమికంగా నాలుగు తప్పులు చేస్తారు.

1) అల్లాహ్ వ్యక్తిత్వంలో షిర్క్

2) అల్లాహ్ గుణగణాలలో షిర్క్

3) అల్లాహ్ అధికారాలలో షిర్క్.

4) అల్లాహ్ హక్కుల్లో షిర్క్.

1) అల్లాహ్ ఉనికిలో షిర్క్‌కు స్పష్టమయిన ఉదాహరణ క్రైస్తవులు. వారు హజ్రత్ ఈసా(అ)ను దేవుని కుమారునిగా పేర్కొంటారు. అల్లాహ్ ఎవరయినా మానవుడు లేక ఏదైనా ప్రాణి రూపంలో రావడం వ్యర్థమయిన విషయం. సకల సృష్టి నిర్మాత ఒక మానవ రూపంలో వస్తాడన్న భావాన్ని మనిషి ఎన్నడూ తన మేథలో చోటివ్వడు. అల్లాహ్ కుమారుడు అన్న విశ్వాసం అల్లాహ్ వ్యక్తిత్వంలో షిర్క్ చేసే విశ్వాసం. అదేవిధంగా బహుదైవా

రాధకుల దైవదూతల్ని అల్లాహ్ కుమార్తెలుగా భావిస్తారు. ఇది కూడా అల్లాహ్ వ్యక్తిత్వంలో షిర్క్ చెయ్యడమే. అదేవిధంగా భారత్‌లో బహుదైవా రాధకులు దేవుడు రాముని రూపంలో వచ్చాడన్న విశ్వాసం కూడా అల్లాహ్ వ్యక్తిత్వంలో షిర్క్‌పై ఆధారపడినదే.

2) గుణగణాలలో షిర్క్: ఆద్యంతాలనూ ఎరగటం అల్లాహ్ గుణం. విశ్వంలోని అణువణువునూ ఎరిగియుండటం ఆయన గుణం. విశ్వంలోని ప్రతి వ్యక్తి పలికే మాటను ఏకకాలంలో వినడం ఆయన గుణం. ఒక మనిషి భూమండలంలోని ఒక మూలనుంచి పిలిచేవానినే వింటాడు. అదే సమయంలో భూమండలంలోని మరొక మూల నుండి పిలిచేవానినీ వింటాడు. ఇంకా ఆయనకు అన్నీచూసే గుణం ఉంది. అంటే ఆయన ఒకేసారి అన్ని వస్తువుల్ని చూస్తాడు. ఇతర వ్యక్తుల విషయంలో కూడా అల్లాహ్ అన్నీ ఎరిగిన వాడయినట్లే వారి విషయంలోనూ అన్నీ ఎరిగిన వారని భావించడం, ఇంకా అల్లాహ్ ఏ విధంగా చూసేవాడూ, వినే వాడో, వారు కూడా చూసే, వినేవారని భావించినట్లయితే దైవ ఏకత్వం గురించిన సరయిన భావన అతడి బుర్రలోకి దిగలేదన్నమాట. ఎవరయినా ఒక మనిషి ప్రక్కమీద కూర్చునో, పడుకునే ఎవరయినా మహాపురుషుడ్ని నాకు సహాయం చెయ్యండి అని ప్రార్థిస్తాడు అంటే అతడు అల్లాహ్ గుణగణాల్ని మానవులకు అంటగడుతున్నాడు అని స్పష్టమవుతోంది కదా!

3) అదేవిధంగా దేవుని అధికారాన్ని ప్రాణులకు అంటగట్టడం అల్లాహ్ అధికారాలలో షిర్క్ చేసినట్లవుతుంది. ప్రాణులన్నింటి అదృష్ట దుర దృష్టాలను నిర్ణయించడం అల్లాహ్ అధికారంలోని విషయం. అల్లాహ్ ఏ మనిషి కోసం ఎంత నిర్ణయించాడో దానిని తగ్గించడంగాని, పెంచడంగానీ ఎవ్వరూ చేయలేరు. ప్రపంచంలోని శక్తులన్నీ కూడగట్టుకొని ఒకరిని అంతం చెయ్యదలిస్తే, అది అల్లాహ్‌కు సమ్మతం కాకపోయినట్లయితే ఆ

మనిషిని ఎవరూ అంతం చెయ్యలేరు. అదేవిధంగా అల్లాహ్‌గనక ఒకరిని అంతం చెయ్యదలిస్తే ప్రపంచంలోని శక్తులన్నీ కలిసి కూడా అతడ్ని రక్షించలేవు. మానవుడు ప్రాథమికంగా చేసిన తప్పిదాలలో ఒకటి ఏమంటే అతడు అల్లాహ్ అధికారాలలో అనేకుల్ని చేర్చాడు. మానవుడు గనక అల్లాహ్ వ్యక్తిత్వం, ఆయన గుణగణాలు, అధికారాలలో షిర్క్ తప్పిదాలను చెయ్యకపోయినట్లయితే ఇతరుల్ని ఆరాధించడం కూడా అవసరం కాజాలదు. అతడు తన అదృష్టాన్ని ఎవరు బాగు చెయ్యగలరో, లేక చెరపగల శక్తిగలవారో వారినే ఆరాధిస్తాడు. ఇతరులెవరి వద్ద అయినా, పదవీ, అధికారం ఏదీ లేదని గ్రహించినట్లయితే అతడు అల్లాహ్ అధికారాలలో షిర్క్ చెయ్యకుండా దూరంగా ఉంటాడు.

4) ఈ మూడు తప్పిదాల ఫలితంగా మనిషి అల్లాహ్ హక్కులలో షిర్క్ చెయ్యసాగాడు. అతడు ఆరాధించవలసింది అల్లాహ్‌ను, తల వంచాల్సింది అల్లాహ్ ఎదుట. కాని అతడు వేరెవరిలో దైవత్వ గుణాలు, అధికారాలు ఉన్నాయని అనుకుంటే వారి ఎదుట తలవంచడం ఆరంభిస్తాడు. దివ్యఖుర్‌ఆన్ మానవుడి బుర్రకెక్కించగోరేది ఏమంటే, అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు ఎవరూ లేరు. అన్నీ వినేవాడు, సమస్తం ఎరిగినవాడు, కనిపెట్టి ఉండేవాడు, శక్తిగలవాడు ఆయనే. మొరలను వినే స్వీకరించే అధికారాలు కేవలం అల్లాహ్‌కే ఉన్నాయి. ఇంకా దాస్యం, ఆరాధన ఆయనకే చెయ్యాలి. దివ్యఖుర్‌ఆన్‌లో పటిష్టమయిన ఆధారాలతో పలుమార్లు ఈ విషయాలను పునరుచ్చరించడం జరిగింది. ఆవిధంగా మానవుడు అల్లాహ్‌ను తప్ప ఇతరుల్ని ఆరాధ్యులుగా చేసుకోవడం మానుకోవాలని.

ఆరాధన భాగస్వామ్యం అనే ఈ తప్పిదం లాగే మానవుడు ఎల్లప్పుడూ పాల్పడే తప్పిదం దైవత్వంలో భాగస్వామ్యం కల్పించడం. ప్రభువు అంటే పరాత్పరుడు, అధిపతి, నాయకుడు మరియు యజమాని. ఈ

రెండు అర్థాలలోనూ మానవులు అల్లాహ్‌తోపాటు ఇతర ప్రాణులనూ చేర్చారు.

## దైవత్వంలో షిర్క్!

మనకు ఉపాధినివ్వడంలో అల్లాహ్‌తోపాటు ఇతరులు కూడా చేరి ఉన్నారని మనను పోషించడంలో, ఉపాధిని ఇప్పించడంలో, ఆరోగ్యం ప్రసాదించడంలో ఇతరులూ భాగస్వాములే అని ప్రజలు భావించారు. కనుక ఇతరుల్ని పోషకులుగా భావించి వారి ఎదుట సాగిలపడసాగారు. మానవుడు ఎవరినైనా తన ప్రభువు, పోషకుడుగా భావించనంతవరకూ వారి ఎదుట తలవంచడు. వారి భావనల ప్రకారం అతీంద్రియ శక్తులు గల వారిగా భావించినవారికి మానవులు పరాత్పర గుణం అప్పగిస్తూ వచ్చారు. కొందరు దైవదూతల విషయంలో, కొందరు మానవుల విషయంలో, మరికొందరు గ్రహాలూ, నక్షత్రాల విషయంలో, జంతువులు, వృక్షాల విషయంలో దైవత్వ భావన ఏర్పర్చుకున్నారు. దైవత్వ భావనల్లో ఒక భావం మనిషి, మనిషికే దేవుడు. ఇరాక్ భూభాగం నా అధీనంలో, అధికారంలో ఉందికనుక నేనే ప్రభువును అని నమ్రూదు వాదించాడు. హజ్రత్ ఇబ్రాహీం (అలై), 'నా ప్రభువు తాను కోరిన వారిని బ్రతికిస్తాడు. తాను కోరినవారికి మరణాన్నిస్తాడు'' అని అన్నప్పుడు నమ్రూదు "నేను కూడా నేను కోరిన వారిని బ్రతికిస్తాను. నేను కోరినవారిని చావునిస్తాను'' అన్నాడు. తిరిగి ఇబ్రాహీం(అ) అన్నారు, "నా ప్రభువు సూర్యుడ్ని తూర్పు నుంచి ఉదయింపచేస్తాడు. నీవు పడమర నుంచి ఉదయింపచెయ్యి చూద్దాం'' ఆ తిరస్కారి నిరుత్తరుడయ్యాడు. కారణం ఏమంటే విశ్వానికి ప్రభువు తాను కాదని అతనికి తెలుసు కాబట్టి. అయినా వాడు తన రాజ్యంలో దైవత్వం చలాయించదలిచాడు.

ఇదేవిధంగా ఫిరౌన్‌కు చెందిన సంఘటన కూడా. ఫిరౌన్ తానే అందరికన్నా పెద్ద దేవుడినని ప్రకటించుకున్నాడు. అందుకు ప్రాతిపదిక, ఈజిప్టు యావత్తు నా అధికారంలో వుంది అని భావిస్తూ ఉండటమే. ఈజిప్టు దేశ వ్యవస్థ నా పరిపాలనలోనే నడుస్తూ ఉంది కనుక నేనే పెద్ద దేవుడ్ని అని అతడి అభి ప్రాయం. కాని- తౌహీద్ (ఏకత్వం) దైవత్వంలో ఎటువంటి విభజననూ అంగీకరించదు. అందుచేత దివ్యఖుర్‌ఆన్‌లో అనేకచోట్ల అల్లాహ్ దైవత్వ ఘనత ప్రస్తావించబడింది. అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు ఎవరూ లేరని మనిషికి తెలియచేయటమే దీని లక్ష్యం. దివ్య ఖుర్‌ఆన్ అసలు ఉద్దేశ్యం ఇదే.

వారి బుర్రల్లోనుండి దైవత్వం గురించిన తప్పుడు భావన తొలగి పోయినప్పుడే ప్రజల జీవితాల్లో చోటుచేసుకున్న చెడుగులు దూరం కాగలవు. దైవత్వం గురించిన అజ్ఞానం దూరం కాకపోతే ప్రజల సంస్కరణ జరిగే అవకాశమే లేదు.

**వ ఆఖిరు దావాన అనిల్ హందులిల్లాహి రబ్బిల్ ఆలమీన్**

(సమాప్తం)